శ్రీ మహాత్మా

# గాంధీ శతకము.

ఇయ్యది


డి. యల్. గంగాధరశ్రేష్ఠి, బి. ఏ., గారిచే


వ్రాయఁబడి


శ్రీ గ్యా౯. అంబటి సుబ్బరాయగుప్త, M. A , B. Ed. గారిచే


పరిష్కరింపబడి


గా విశ్వనాథగుప్త, కాకుమాని రామలింగయ్యశ్రేష్ఠిగార్లచే

ప్రచురింపబడియె.

హిందూపురము

1933.






దీనివెల **0-3-0.**

# విజ్ఞాపన.

అఖిలప్రపంచమాననీయుండును, జగత్ప్రఖ్యాత పురుషుండును, సర్వసంగ పరిత్యాగియు, దీనరక్షణ బద్ధకంకణుండును, అస్పృశ్యతానివారణ దీక్షాబద్ధుండును, దరిద్రనారాయణ బిరుదాంకితుండును అగు మహాత్మా మోహనదాసు కరంచందు గాంధిగారి స్వీయచరిత్రను చదువు భాగ్యము లభించిన కాలమందు మదీయ మిత్రుండగు మ॥ రా॥ శ్రీ దాసా లక్ష్మీకాంతయ్య శ్రేష్ఠిగారి ప్రేరేపణచే నా యల్పజ్ఞానావకాశములో నొక శతకము రచియింప మిగుల కుతూహలముతో నుంటి. ఆప్రకారమే నీచిన్ని పొత్తమును వ్రాసినాడను.

నాయీపుస్తకము ప్రథమ ప్రయత్నము కాబట్టి తప్పులు కుప్పలుగా నుండవచ్చును. బాలునిమీద దయయుంచి విద్వాంసులు లోపములను తెలియపరచిన ద్వితీయ ముద్రణమున దిద్దుకొందు. ఈ పుస్తకమును పూరించుటకు మిగుల ప్రోత్సాహపఱచిన విద్వాన్ సింగరాజు. రామలింగశాస్త్రిలుగారికిని, చిత్తుప్రతిని సవరించిన శ్రీయుత విద్వాన్ అంబటి. సుబ్బరాయగుప్త M. A, B. Ed., గారికిని నామనఃపూర్వక వందనములర్పించుచున్నాడను.

దీనిని ప్రచురింప తలంచి కోరినవెంటనే నాదుమిత్రులగు శ్రీయుతులు కట్టా విశ్వనాథగుప్తగారు, కాకుమాని రామలింగయ్య శ్రేష్టిగారు దయతో నంగీకరించి ప్రచురించినందులకు వారికి నా కృతజ్ఞతాభినందనములు. ఈ ముద్రణము నత్యల్పకాలములో ముగించి యిచ్చిన శ్రీ సుదర్శన ముద్రణాలయాధిపతులు మిగుల వందనీయులు

హిందూపురము
20_12_33.

ఇట్లు బుధజన విధేయుఁడు,
డి. యల్. గాంగాధరశ్రేష్ఠి, బి. ఏ.,

# FOREWORD.

శ్రీయుతులు, హిందూపురము మునిసిపల్ రెవిన్యూ ఆఫీసరు డి యల్. గంగాధరము శ్రేష్ఠి బి. ఏ. గారు రచియించిన "గాంధీశతకమను" గ్రంథమును స్థాలీపులాకన్యాయమునఁ జూచితిని. లోకోత్తర పురుషుల జీవితమును బామరలోకమునకెఱింగించి వారిని సన్మార్గమునకు మఱల్పవలసినపుడు సులభశైలి గ్రంథములు కావలసియుండును. శ్రీ శ్రేష్ఠి గారు నేఁడిట్టి కార్యము నీగ్రంథరూపమున నిర్వర్తించి ధన్యులయిరి. గుణగ్రహణపారీణులగు పండితులెల్లరును శ్రీ శ్రేష్ఠి గారి యుద్యమమును బ్రశంసింపక పోవరని నాయాశయము. వీరింకను నిట్టిసద్గ్రంథములను వ్రాసి దేశసేవయును భాషాసేవయును, జేయునట్లుల శ్రీపరమేశ్వరుఁడు వీరిని దీర్ఘాయురైశ్వర్యముల మనుచుగాత! మని యాశించెదను.

మదరాసు
24-12-32.

విద్వాన్ తూళా విశ్వనాథశాస్త్రి
పచ్చయప్ప కళాశాలాంధ్ర పండితులు.

THIS SATAKAM IS

PUBLISHED

in Honour of the

FIRST VISIT OF

# MAHATMAJI

TO

HINDUPUR,

on the morning of 4th Jan. 1934.

**Messrs. Katta Viswanatha Gupta,**
**Kakamani Ramalingiah,**
*Publishers*

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 7 | నార్వ్యకు | నారుయ్యకు |
| ,, | 11 | తేనీయ | తేనియ |
| ,, | ,, | జ్ఞేయూ | నిమ్మ్రి |
| 2 | 7 | దైర్యము | ధైర్యము |
| 5 | 1 | గస్తురీ | గస్తూరి |
| ,, | 11 | దాస | దాస్య |
| ,, | 21 | చేశి | చేసి |
| 6 | 6 | కొద్ధిరెూ | కొద్దిరెూ |
| 7 | 4 | కుదఁయ | కుఁదయ |
| ,, | 10 | చెడలు | చెడ్డలు |
| ,, | 13 | ప్రాయము | పాయము |
| ,, | 15 | కొంచము | కొంచెము |
| 11 | 13 | పలువిథ | బహువిధ |
| ,, | 20 | నా | నాడ |
| 15 | 14 | యమైయుండు | యంబొండు |
| 18 | 5 | డయారీ | డయిరీ |
| 25 | 7 | ప్రెశిడెంటు | ప్రెసిడెంటు |
| 28 | 23 | దాస్మమోక్షు | దాస్యమోక్షు |
| 29 | 10 | బొట్టినావు | బుట్టినావు |
| ,, | 18 | మిటిమాల | మిటియాల |
| 38 | 5 | క్షౌరికు | క్షౌరకు |
| ,, | 6 | కత్రించు | కత్రించి |
| 41 | 15 | ట్టుయంగ | ట్టువంగ. |
| 42 | 10 | "రాయి"ను | "రాయి"దు |
| ,, | 19 | ఘోరయూ | ఘోరమా |
| 43 | 3 | చేశిన | చేసిన |
| 44 | 7 | వ్రాశి | వ్రాసి |
| ,, | 13 | సీత | శీత |
| 45 | 7 | ఆపీసు | ఆఫీసు |

ఓం.

మిత్రమా!

1. శతకరత్నాలు, శతక వైఢూర్యాగాధ కూపాలు ఎన్నో చూచానుకాని ఏకొన్నో నాబోటి పామరసామాన్యులకు బోధపడ్డం బహుదుర్లభమవుతూంది. రచయితలు, ప్రపంచంలో పండితుల సంఖ్య అత్యల్పమనిన్నీ, పామరుల సంఖ్య బహుబాహుళ్యమనిన్నీ, మరచి తమ అఖండ పాండిత్య పతిమోద్రేకప్రదర్శనం తడాఖా కొంచం చూపిద్దామనే కాంక్షతో భావాంబర వీధినుండి ఒకషట్లీ కొడ్తూన్నారు. ఆవుడుకులో కట్టతెగి సంస్కృత పదాలు కుప్పించి దూకడం ప్రతిఫలంగా పరిణమిస్తూంది. ఈ హడావిడిలో వ్రాయదలచిన నాలుగు ముక్కలు పలాయనమై ఉక్కుశనగల్లాగ ఊడిపడ్డ నాల్గు పద్యాలు నాబోటి సామాన్య మాత్రులకు చిదంబర రహస్యం క్రింద తేల్తూన్నాయి.

2. పుట్టుకతో ఉగ్గుపాలతో అలవడ్డ నాల్గుసాధారణ గ్రామ్యంముక్కల్లో యీపవిత్ర శతకాన్ని వ్రాసింటే యింకా ఎంతో బాగుండేది. ఈలాంటి శతకాలు వగైరా వ్రాద్దామంటే “ముంగిట నిల్చేది మూడేచిక్కులు” భాషపైకిలాగడం—భావాలు క్రిందికీడ్చడం—యతిప్రాసల తొందర మోటారు బ్రేకుల్లాగ—యింతే.

3. ఇంక మీశతకంమాట-భాషయిబ్బంది అత్యల్పం భావాలు అచ్చొత్తినట్లుపాడడం శుభ్రంగా కానుపిస్తూన్నాయి. ఇంకేమికావాలి?

Madras, 20-12-33 } Dr. D. Siddappa Chetty, L. I. M.,
*Registered Medical Practitioner.*

శ్రీరస్తు

అస్మత్సహృద్వర్యులగు మహారాజశ్రీ డి. యల్. గంగాధరయ్యశ్రేష్ఠి గారిచే విరచితమగు "గాంధీశతకము" నామూలాగ్రముగ దిలకించితి. ఇదియే ప్రథమ ప్రయత్నమగుటచే నెందేని దోసగులు వొసగి యుండవచ్చును. "కథంనసా మద్గిరమా విలామపి స్వసేవినీమేవపవిత్రయిష్యతి" యను భంగి బురుషోత్తముడగు గాంధీమహాత్ముని చరితము పద్యాత్మకముగ రచియించి యుండుటంజేసి కవిభారతియు, జన్మమును పవిత్రములాయెనని నిస్సంశయముగా నుడువనగును. వీరిట్టిలోకోత్తర చరిత్రములనేకములవ్రాసి దేశారాధకులగుదురుగాక.

ఇట్లు,

హిందూపురము. 23_12_33 | సహృదయ విధేయుడు విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి.

శ్రీమహాత్మా
గాంధీ శతకము.

ఈచిన్నిపొత్తము సత్ప్రీతితో నందుకొని చదివినాడ. చాల ఆనందమందినాడ. శైలి మృదుమధురముగాను, సులభముగా నుండుటేగాక సరళముగానున్నది. ఒక్కొక్క చిన్నపద్యమొక్కొక నీతిని బోధించునట్లు కూర్పబడియుండుట దీనిలోనొక్క విశేషము గాననగును. శ్రీవాణి కవియొక్క మధురవాక్కులలో నిలిచి సద్గ్రంథములనేకములు రచియింప జేయుటకు వీరికి భగవంతుడు చిరాయురారోగ్య ఐశ్వర్యముల నొసగుగాత.

కె. వాసుదేవ శెట్టి,
23_12_33

శ్రీ గాంధీశతకము.



మోహన్ దాసు కరంచందు గాంధి.



ఓం.



# శ్రీ మహాత్మా
# గాంధీ శతకము.

సీ॥ రామాయణంబును । వ్రాయవాల్మీకికి
సాహాయ్యపడినయో । శారదాంబ!
భారతరచనకై । ధీరనన్నయకును
సాహాయ్యపడినయో । శారదాంబ!
భాగవతము సెప్ప । భక్తపోతన్నకు
సాహాయ్యపడినయో । శారదాంబ!
మనుచరిత్రనుగూర్ప । ఘనపెద్దనార్యకు
సాహాయ్యపడినయో । శారదాంబ!
భువిమహాత్ముఁడనంగ పెం । పొందుగాంధి
గూర్చి శతకంబు రచియింపఁ । గుతుకమొదవె
పలుకు పలుకున తేనీయ । లొలుకజేయు
సరససద్గుణ నికురుంబ । శారదాంబ॥ 1.

సీ॥ సుగ్రీవ సఖ్యంబు । సులభాన రాముని
కలనాఁడు గూర్చిన। యాంజనేయ!
రఘువంశ సోముని। రామునువెదుకంగ
నంబుధి దాటిన । యాంజనేయ!
ముద్రాటుంగరమును। ముదితకుఁజూపించి
యాసలుగూర్చిన। యాంజనేయ।
దశకంఠునకు స్వీయ। ధైర్యముజూపెట్టి
నాలంకగాల్చిన । యాంజనేయ!

దనుజులనుద్రుంచి తనబంటుఁ। దనముసూపి
యవనిజనురామచంద్రున। కప్పగించి
యనని సన్నుతి కెక్కిన । యాంజనేయ
జోతసేయుదు నెపుడు వాక్శుద్ధికొఱకు॥ 2.

సీ. వేంకటరాయప్ప। వేంకటాచార్యులు
అక్కరంబులు నేర్పి। రాదియందు
వేంకటసుబ్రామ । విశ్వనాథార్యులు
ధీ, విశేషముసబో।ధించినారు
శేషాచలార్యుల । శ్లీలంబుఁబోదట్టి
కైతంబు ఫక్కిని। గఱపినారు
సోమయాజియు మఱి। రామానుజులుమంచి
నీతులప్రేముడి । నెఱపినారు

గురువరేణ్యులు, వారిని । పరగదలచి
హితునిప్రోత్సాహమునమది। నెలమితోలక
భక్తియేగాని భాషలో। పటిమలేదు
గాంధి శతకంబు వ్రాయంగఁ ।గడగినాడ॥ 3.

సీ॥ గాంధినామంబును । గాయత్రి జపముగా
జపియించువారల। చరణములకు
రాటమే భువియందు । రతనాలమూటగా
భావించువారల । పాదములకు
శాంతిసత్యంబులే । శాస్త్రిములుగా నెంచు
వీరుల చరణార । వింద ములకు
దార్జన్య రహితమే। ధర్మంబుగా నెంచు
విమలశీలురయంఘ్రి। కమలములకు

మ్రొక్కువారలకెల్లను । మ్రొక్కువాఁడ
చిత్త శుద్ధిపెఁ గల్గిరో। చిన్మయాత్మ!
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు!గాంధియోగి ॥ 4.

సీ॥ ఇలపచారు దినును । లిమ్మగనమ్మగాం
ధి కుటుంబమునబుట్టి । ధీయుతుఁడయి
సంస్థానమంత్రుల । స్థానంబువహియించి
నట్టి "ఉత్తమచందు" । నాత్మబుట్టి
పోరుబందరునకుఁ । బోయి ప్రిధానమం
త్రిగ రాజ్యమేలిన । తీవ్రకోపి
యగు కబాగాంధిజి। యందుద్భవించిన
సత్యవంతుడరయ। నిత్యశాంతి

మూర్తి దైవభక్తుఁడు మాకు। మోక్షమిచ్చు
గాంధిదేఁవుడు నిజముగఁ । గావెనీవు
ధర్మపరిరక్ష ! హైందవ ।దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు! గాంధియోగి. 5.

సీ॥ రాజాధిరాజుల । రాజ్యాలనేలిన
మంత్రులునీవారు। మాన్యచరిత!
దేవాదిదేవుల। దీక్షతోఁబూజించు
భక్తులునీవారు । భక్తవర్య!
బీదసాదలకెల్ల। భిక్షంబు బెట్టెడి
పుణ్యులు నీవారు । పుణ్యమూర్తి!
పొలిటికల్ ఏజంట్లు । పొగడుకులాంగని
ధీరులు నీవారు। ధీరవర్య !

ఇట్టి వంశానబుట్టిన। యట్టినీవు
భరతమాత దాస్యంబును। బాపుమయ్యా
ధర్మపరిరక్ష ! హైందవ। దాస్యమోక్ష
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 6.

సీ॥ బడిలోనన్నైనను । బడిబైటన్నైనను
బొంకులాడనివాఁడ। పుణ్యమూర్తి ।
క్లాసుపరీక్షలో। "కాపి" చేయుమనిన
"కాపి" కొట్టనివాఁడ । ఘనుఁడశీల !
తల్లిదండ్రులయెడఁ। దనయుండు శ్రవణుఁడు
చూపిన భక్తినిఁ ।జూపుఘనుఁడ!
నాఁడు "హరిశ్చంద్ర"। నాటకంబునఁగాంచి
సత్యంబునేర్చిన। సత్యహృదయ!

పిన్నవయమున సన్మార్గ। విధినిఁబూని
మార్గదర్శకు డైతివి । మానవులకు
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష।
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 7.

సీ॥ బాల్యానఁ గస్తూరీ। బాయినిఁ బెండ్లాడి
బాల్యవివాహముఁ। బాపుతెంచ్రి!
అరయంగ భార్యపై। నధికారముఁ జూపి
చూపరాదని చెప్పు। సుగుణమూర్తి!
వెలయ పెక్కేఁడులు। విషయలోలుండవై
యట్లుండవలదని। యనెడు బుద్ధి!
కలబొల్లిమాటలఁ। గడపియు రాత్రులు
కడపరాదని చెప్ప। కార్యదీక్ష!

వీనియందలి సత్యమ్ము। వెల్లడింప
మొదట కడగండ్లు పడువెల్ల। విదితమయ్యె
ధర్మపరిరక్ష! హైందవ। దాసమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 8.

సీ॥ మాంసంబుఁ దిన్నచో। మదియించియాంగ్లేయ
దొరలనందఱి బారఁదోలవచ్చు
మాంసంబుఁ దిన్నచో। మదియించి దొంగల
గుండియలదరంగఁ। గొట్టవచ్చు
మాంసంబు దిన్నచో। మదియించి వ్యాధుల
వారించి సౌఖ్యంబుఁ। బడయవచ్చు
మాంసంబుఁ దిన్నచో। మదియించి దయ్యాల
భయము సుంతయు లేక। బ్రతుకవచ్చు

ననుచు మిత్రుఁడు తెలుపనీ। వట్లుచేసి
దాసలోపంబు నెఱిఁగింప। మానవలదె
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 9.

సీ॥ ఏకాంతమగు చోటి । కేఁగి మిత్రునివెంట
నేర్పుతోఁ గనరాక । నిజమునరయ
మాంసంబునొట్టియు । మద్యంబుఁ జూడక
చూడరుచింపక । సొరిదిఁ దనరి
సంస్కరణంబున । సంతుష్టుఁడగుటకు
కొద్దియో గొప్పయో । కుడిచిమరల
గృహమునకేతెంచి । గృహిణినిఁబిలిపించి
కేళీగృహంబున । కిముకుమనక
నిద్రపోవంగ రాదయ్యె । నిద్రనాఁడు
అనుచు సత్యంబుఁ బలుకంగ । సగుననీకు
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 10.

సీ॥ కల్లు త్రావించెను । కష్టంబు లేకుండ
సంధ్యాకాలంబున । శాంతముగను
మాంసంబుఁ దినిపించె । మాతాజిముందట
బొంకులాడించెను । పూర్వముగను
భార్యతో గొట్లాట । బాగుగఁ బెంచంగఁ
జేసెను మిత్రుఁడు । చిత్రముగను
బోగమింటికడకుఁ బోవంగఁజేసెను
భోగింపలేదయ్యె । పుణ్యమేమొ
అనుచువ్రాయంగఁ గాదొకో । యరయనీవు
మంచిచెడ్డలు తెలిసెను । మాకుఁదండ్రి
ధర్మపరిరక్ష! హైందవ దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 11.

సీ॥ నౌకరు సొమ్ములో। నయమున నొకయింత
ధనము దొంగిలిబీడి। త్రాగినాము
పరతంత్రతకు మేము। పరమదుఃఖముఁ బొంది
ఆత్మహత్యకుఁ దయా। రైతిమపుడు
వలయు ధైర్యము మాకు। వలనొప్ప రాకుంట
సల్లాము బీడీకి। సలిపినాము
అంతతో చోరత। కంత్యంబు చేయంగ
మొదలుపెట్టితివయ్య। ముఖ్యముగను
అనుచుఁ దెలుపంగ గల్గిన। యనఘుఁడీవె
మంచి చెడలు తెలిసెపో। మాన్యచరిత
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధయోగి॥ 12.

సీ॥ చిన్నన్నపరులకు। చిఱుతప్రాయమునందె
పాతిక రొక్కము। బాకిపడితె
బాకి తీర్చితివయ్య। బంగారుకొంచము
మురుగులోనిది యమ్మి। మరుగుగాను
కాని నాకిదియేమొ। కష్టంబుగానుండ
దోష స్వీకారంబు। దుదిని నేను
చేయంగ గల్గితి। చీటిపై లిఖియించి
తండ్రియెదుట బెట్టి। తక్షణంబె
ఇదియె తగునైన శిక్షని। యెరుగుమయ్య
అనిన నీకిప్డు వందన। మందుకొనుము
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 13.

సీ॥ వ్యాధిచేనాతండ్రి। బాధలుపడుచుండ
భక్తితోఁజేసితి। పాదసేవ
నైనరాత్రులయందు। ననవరతంబును
మనసెల్ల నాకేళి। మందిరమున
నాతండ్రి గతియించు। నాటిరేభార్యతో
నానంద జలధి తే।లాడుచుంటి
ఇట్టి నాయవమాన। మింతింతయనరాదు
మాయకుండెడిదయ్య। మచ్చనాకు
ననుచు నీబోటి ప్రాకృవ్వ। నవనియందు
మంచిచెడ్డలు తెలిసెబో।మాన్యచరిత!
ధర్మపరిరక్షు! హైందవ।దాస్యమోక్షు!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 14.

సీ॥ ఆత్మసాక్షాత్కార। మనున దేమతమని
త్రికరణశుద్ధిగఁ। దెలిసికొంటి
సర్వమతములందు। సరిసమానంబగు
ఆదరభావంబు। నందినాడ
హైందవవిగ్రహా.రాధన నిరసించు
క్రైస్తవుల్ పఱుపేర్మి। నాస్తియయ్యో
అంతమాత్రమున నా।కఖిలేశ్వరునియందు
భక్తి కుదిరెనంచు। బలుకజాల
నని నిజంబును చెప్ప మ।హాత్మనీదు
అభిమతమె సర్వసమ్మత।మనగవలదె
ధర్మపరిరక్షు! హైందవ। దాస్యమోక్షు!
కలిభయత్యాగి! జోహారు। గాంధియోగి॥ 15.

సీ॥ మెట్రిక్కు ప్యాసయి। మేటిశ్యామలదాసు
కాలేజిలో జేర। గడగినపుడు
బారిష్టరైనచో : బాగుండుననిజోషి
చెప్పంగ సీమను। జేరనెంచి
మద్యమాంసంబుల । మహిళల నంటనం
టంచు బాసనుజేసి । తంబకడను
పినతండ్రిమాతాజి। పెద్దన్న యాశీర్వ
దింప బొంబాయిలో। దిగియు, సీమ

వెంటనే జేరగాదయ్యె। వినుడటంచు
కష్టములు సెప్పఁ దెలిసెత । త్కష్టదశలు
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు ! గాంధియోగి॥ 16.

సీ॥ కులమునఁ గొందఱు । వెలివేయనెంచిరి
బాలుఁడౌ సీమకుఁ। బయనమగుడు
ధనసహాయముఁజేయు । ధనవంతులకు "ఫైను"
వేయంగనెంచిరి। విసుగులేక
తత్కారణంబున । ధనము నిచ్చెదనన్న
బావమున్నాఁడీన। పలుకు తప్పె
అంతనాశ్రేయంబు ! నభిలషించినయొక
ధన్యుఁడు వలసిన । ద్రవ్యమిచ్చె

ననుచు నీకష్టసుఖముల । నన్నివిప్పి
కరతలామలకముగఁ జెప్ప। ఘనుడఁవీవు
ధర్మపరిరక్ష ! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 17.

సీ॥ సీమకుబోవంగ । సీమరునెక్కితిఁ
గాని వాక్చతురత । గలుగలేదు
తల్లికిచ్చినమాటఁ । దప్పకపాటించి
తరుణుల, మాంసముఁ । దాకలేదు
దర్శించి మహాత్మాను । దగినపాఠంబులు
నేర్చితి మిక్కిలి । నేర్పుమీర
నాడలుమాత్రమె సీమఁ । బడియుండెనేగాని
మనసు నాతల్లిపై । మానలేదు
అనుచు వ్రాసిన సీకిపు । డరయమేము
వందనసహస్ర మర్పించు । వారమయ్య
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 18.

సీ॥ మహాత్మగారాయన । మిత్రునిగృహమందు
వసియింపనాకాజ్ఞ । వడయఁజేసె
అతఁడునన్నంతో । యాదరించెనుజాల
నాంగ్లేయభాష మాట్లాడ నేర్పి
మాంసముదిన బలు । మారుప్రసంగింప
కారణంబయ్యెను । కలహమునకు
"వెజిటేరియన్ డైటు" । విడనాడనైతిని
కష్టము లెన్నని । గలుగఁగాని
అనుచువ్రాయంగ గాదొకో । యరయమేము
మంచిచెడ్డలెఱిఁగితిమి । మంచితముగ
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 19.

సీ॥ మాంసంబు వర్జించి। మనసారనింగ్లీషు
వారితో మెలఁగఁగ। వచ్చునంచుఁ
జెలికాని కెఱిఁగించి । శీఘ్రకాలంబున
నెక్టైని ముడివేయ ; నేర్చికొంటి
రెండు పేటలచైను । రిస్టువాచికిఁగట్టి
లీలమైచేఁదగి। లించికొంటి
నృత్యముఁ బ్రేంచిని । నిత్యముఁ నేర్చితి
మూడువారంబులు। ముదముతోడ

ననుచువ్రాయంగ దెలిసెనీ। యాంగ్లవేష
మంతయును దానిలక్షణా। లరసినాము
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 20.

సీ॥ పలువిధభక్ష్యాలు । పరిశీలనము సేయ
వెజిటేరియన్ డైటు । వేత్తలెల్ల
వ్రాసిన పొత్తాలు । వరుసగఁ జదువంగ
నాలుగు విషయాలు । నాకుఁ దెలిసె
మాంసంబు కాదని । మనసార గ్రుడ్లను
దినుచు తద్దోషంబు । తేటపడఁగ
నలనాటినుండియు । నాజేసిపెన్నిల
బువ్వను తినుదీక్షఁ । బూనినాను

అనుచు వ్రాయంగ నెయ్యది । యరయమాకు
తినుట కర్హంబనర్హంబొ । తెలియవచ్చె
ధర్మపరిరక్ష ! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 21.

సీ॥ ఇచ్చెడిపై సాకు । వచ్చెడి పైసాకు
లెక్కవ్రాయ వ్యయము । తక్కువయ్యె
మర్యాదవిందులు । మఱిరెంటఁతగ్గింప
వీఁడును మార్చంగ । వీలుపడియె
బంట్లు బస్సులుమాని । పలుమాఱునడువంగ
జబ్బులురాకుండ । డబ్బుమిగిలె
ఇన్నిచేసినగాని । ఇంటి ఖర్చులు హెచ్చ
తగ్గింప వంటకుఁ । దవిలితేను

ననెడు స్త్రీవ్రాతలబఠింప । నవనిమాకు
నీదుమార్గాననడువంగ । కాదదేమొ
ధర్మపరిక్ష ! హైందవ ! దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 22.

సీ। విషయంబు వ్రాసినే । వినిపింపనాఁడయ్యె
చదివించి యొకరిచే । సంఘమందు
జదువలేచి సభలోఁ । జదువలేమని నేఁడు
గజగజవడఁకఁగ । మజముదారు
చదువంగ శ్రోతలు । చప్పట్లు గొట్టిరి
లజ్జయ్యె నాకెంతొ । పజ్జనుండ
కానినాబిడియమే । కలిగించె కీడుమేలు
నేఁటికి వాటంపు । మాటలాడ

వలను పడెనంచు వ్రాయఁగాఁ । దెలియవచ్చె
నమ్రతయె శ్రేష్ఠగుణమంచు । నవనిశీల
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 23.

సీ. "భారతయువకులు । భార్యలుండియుమాకు
పెండ్లికాలేదని । ప్రేలుచుండి
అంగ్ల కన్యలతోడ । నాటపాటలలోన
కాలముఁ గడుపుట । గాంచినేను
అవివాహితుఁడనంచు । నటుదాచి నా పెండ్లి
బ్రైటను గ్రామాన । బసను జేయు
పడుచునకును జూపి । పలుకరించుచునుండ
వెళ్ళిపోయెడిదయ్యె । విధవగృహిణి
కాననాయనసత్యంబగు । కందుమాన్ప
లేక వ్రాసితి" ననుచుంతో । లెస్సగాదె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి! 24.

సీ. తీయోసఫిస్టులు । తిన్నగ నన్ను గీతఁ
జదువ ప్రేరేపింపఁ । జదివి నేను
గీతామృతంబును । నాతతంబును గ్రోలు
చున్నాఁడ భక్తితోఁ । జూడరయ్య
గిరియుపన్యాస స । క్తితలలో భేద
మరియ లేదంచు నే । నెఱిఁగితయ్య
నాస్తికమతభూమి । నాటికేదాటితి
కానదాని బఠింపఁ । గష్టమయ్యె
అనుచు వ్రాయంగమాకెల్ల । నఖిలమతము
లందలి రహస్యములు దెలి । యంగనయ్యె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి! 25

సీ॥ కష్టకాలంబునఁ । గరుణించి బ్రోచెడు
వారిని దెలియంగ । వశముకాదు
"పోర్టుసుమతు" మీరు । పోయిడిగిననాఁడు
అవినీతి పరులింట । నరయకుండ
సభముగియగ రాత్రి । శరవేగమున వచ్చి
ప్రియముగ భుజియించి । వేకనాడ
మాటలుచేతలై । మాఱంగ స్త్రీలతో
"నీకిటపని లేదు । నీవుపొమ్మ"
అనుచుమిత్రుఁడుజల్కఁ నీ।యంబ యాన
నరసి యటనుండి తొలఁగిన । పరమపురుష!
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 26.

సీ॥ పారసీకవరాయి । పారసీకపుకోటు
మురికి నిండఁగనుండ । ముదముతోడ
ధరియించి నీమకు । నరయనారాయణ
హేమచంద్రుఁడు రాఁగ । హేళనంబుఁ
జేయుచునుండిరి । చిన్నపిల్లలుచాల
వింతగఁ జోవంగ । వీధిలోన
కానియాతఁడు పుస్తకములను వ్రాయంగ
నేఁజూచి యున్నాఁడ । నిక్కముగను
అనెడునీపల్కు లాలింప । నతనిశక్తి
తేటతెల్లంబుగామాకుఁ । దెలియవచ్చె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 27.

సీ॥ పయనమైపోయితి । ప్యారిసునంతకు
వేడుక పుట్టంగ । జూడఁగోరి
దర్శనస్థలములు । దర్శించుటకు నేను
నడచియే వెళ్ళితి । నాఁడుకూడ
"చర్చస్సు" గనిచాల । సంతసించితివాని
మహిమయు శాంతియు । మఱపురావు
ఎక్కితిముమ్మారు । "ఏఫిలు" గోపురం
బజ్ఞాన చిహ్నమై । నట్టిదాని
అనుచు నీయను భవమున । నార్య! మాకు
తెలిసె దుర్వ్యయమున నేమొ । తెల్లముగను
ధర్మపరిరక్ష! హైందవ! దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 28.

సీ॥ బారిష్టరు పరీక్ష । భయములేకయె "ప్యాసు"
తద్విషయమైయుండు । దలఁపనేల?
చక్కఁగనొకముక్కఁ । జదువనక్కఱ లేదు
విందుకు ముందంజ । వేయవలయు
వీరిని డిన్నరు । బారిష్టరు లనుచు
నగవులాఁటకుఁబిల్వ । న్యాయమయ్యె
పాటకపాత్రముల్ । పఠియించి పట్టాను
జేఁబట్టి బొంబాయి । చేరినాఁడఁ
గాని నాభీతి చెప్పంగఁ । గాదుతరము
అనుచు వ్రాయంగఁ దెలిసె మా । కాంగ్లవిధులు
ధర్మపరిరక్ష! హైందవ! దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 29

సీ: మొహతాను కోర్టులో । మహితగర్జనములు
చేయఁజూచినవారు । చెప్పనాకు
ఎటుల నేర్చెనో విద్య । నీతఁడుసీమలో
ననుచు నాశ్చర్యంబు । నంది నేను
ఉదరపోషణకైన । నుపయోగపడునంత
ద్రవ్యంబు నావృత్తి । సవ్యముగను
సంపాదనముఁజేయ । సంశయంబయ్యెను
కాని "ఫ్రెడరికు ఫిన్ । కట్టు" గారు

నాదుబెంగను నొకమారు ! నవ్వుచేతి
నెగుర గొట్టిరి యుననీక । యగునుబాబు
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 30.

సీ. బొంబాయిరేవులో । పూర్తిగనాలోన
గోచరించెదుపాను । గొప్పదొకటి
జాతిఁబహిష్కృతి । సమధికస్థిరగతి
గానుండనాపైన । గాంచి నాఁడు
మెహతాగారింటికి । మేమంతఁబోవంగ
పరిచయంబెక్కువ । ప్రబలమయ్యె
రాజచంద్రకవికి । రయముగనాకును
పరిచితిఁగల్గెను । ప్రథమమందు

కాననేవారి నెఱుఁగుదుఁ । గల్లగాదు
భక్తుఁడనమాకుఁ దెలిసెనా । వార్తలెల్ల
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 31.

సీ॥ నదిలోన స్నానము । నాయన్న చేయించి
రాజకోటకు వెళ్ళి । రఘుముగాను
విందును జేయంగ । వేంచేసియుండిరి
కొండజుమావారు । కూర్మితోడ
నిలిచినవారిలో । వెలివేసియున్నట్టి
పెద్దలపైనీసు । పెంచకుండ
నేవారి ప్రేమింప । నిరుపమ ప్రేమతోఁ
గనుజూచు చుండిరి । వినరెవ్వారు

అనగ ప్రేమంబుతో క్రోధ । మవని గెలువ
సాధ్యమగునని దెలిసెను । సాధుచరిత!
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 32.

సీ॥ సీమకుఁ బోయినఁ । జిననాటి నా ద్వేష
దుష్టస్వభావంబు । దూరమగునె
కానవేభార్యను । కన్నవారింటికిఁ
బంపించి యుంటిని । పనికిమాలి
కష్టాలపాల్చేసి । కన్నీరుకార్పించి
స్వీకరించితినామెఁ । జింతదీరి
కొంతకాలంబున । కంతయు నాయదె
తప్పుగా గ్రహియించి । తక్షణంబె

అనుచు వ్రాయంగ నినుగాంచి । యార్యులెల్ల
సూక్ష్మబుద్ధితో మెలఁగరే? । సుగుణమూర్తి
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 33.

సీ॥ "వజ్రాల రత్నాల । వ్యాపారముం జేయు
"రాజచంద్ర కవీంద్రు । డోజనరయ
ఆత్మసాక్షాత్కార। మాదిదర్శనము మీఁద
నుండుజూడఁగ వారి । నిండుమనసు
వేదాంతగ్రంథంబొ । వేరొక్కఁడయరీయొ
చదువుటో వ్రాయుటో । చాలవఱకు
చేయుచుంటనువారు । చిత్రంబుగా నుండె
మనసున నేగాంచ । మాన్యులార !

అనఁగ" రాజచంద్ర సుకవి । యవనిలోన
విమలచారిత్రుఁడని మేము । వింటిమయ్య
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు ! గాంధియోగి ॥ 34.

సీ॥ క్రొత్తబారీష్టర్లు । కూటికి నార్జింప
నాళ్ళెంట్లు కాలంబు । ననుటవింటి
బారీష్టరని బోర్డు । బయటకట్టించియుఁ
దరఖీదు నగుచుంటి । సరయ నేను
ముప్పది రూకల । ముడుపును జెల్లింప
"స్మాల్ కాజు" కేసుకు । సమ్మతించి
కోర్టులో హాజరై । కూర్చుంటి సాక్షులఁ
"క్రాసు" చేయఁగ నోట । రాకమాట

అనుచు సత్యంబు నీవు వ్రాయంగ మాకు
సత్యమును బల్కు ధైర్యంపు । శక్తిగలిగె
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 35.

సీ॥ బొంబాయివదలినేఁ । బోయితినిప్పుడు
రాజకోటవసింప । బ్రదుకుకొఱకు
పోరుబందరురాణా । వారిమంత్రిగనుండి
కుట్రయూ సలహాను । గూర్చిచెప్ప
ననునేర మొకటి నా । యగ్రజుపై రాగ
వలదన్న యేజెంటు । వలనుకేగి
నా నెయ్యమునుఁబట్టి । "ననుజూచియైనను
కోపంబుఁబోఁగొట్టు । కూర్మితోడ"
అనినబోయి నేకష్టము । లంది తనుచు
వ్రాయఁజేతురె యింకిట్లు । వాస్తవముగ
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 36.

సీ॥ "ఉద్యోగిసెలవులో । నుద్యోగిపనిమీఁద
వేఱ్వేఱు తథ్యంబు । వినరెమీరు
మాయన్న విషయమై । మనవి చేయఁగనేను
విననంటె విననని । విన్నవించె
నాకథనేనింక । నడుపుచునుండంగ
"వెళ్ళుడు మీఱింక । విడిచి గృహము"
అనినను దొరగారు । వినకుండ గొణగంగ
బంటుతో గెంటించె । బయటనన్ను
అనగ" ఇట్టిజోలికిఁబోవ । నవనిజనులు
మానకుందురె మఱియింక । మాన్యచరిత!
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధయోగి ॥ 37.

సీ॥ "నలువదివేల పౌనుల కేసు గలదొండు
ఆఫ్రికా కోర్టులో । నరయనిపుడు
గొప్ప బారిష్టర్లు । గొప్పవకీళ్ళును
పెట్టియున్నామయ్య । ఫీజునిచ్చి
నీవు తమ్మునిఁబంప । నీ వానికర్చులు
నూటైదుపౌనుల । నొసఁగఁగలము
మాకును మీకును । మఱియింత సాహాయ్య
మగుచుండు నాతనిఁ । బంపవలయు"

అనెడి జాబునుజూచి మీ । యన్న సెలవు
నీయ వెళ్ళంగ నీకయ్యె । నెంతో శుభము
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు! గాంధియోగి. 38.

సీ॥ ముఖ్యాధికారిని । ముఖమున నేఁజూడ
తనగదిలోనుండ । నెతుణంబె
అన్యులకొసగని । దైనను నాకిచ్చి
ప్రేమతో "ఫస్ట్‌క్లాసు । బెర్తు" నొకటి
చదరంగమాడుటఁ । జతురతతో నేర్పి
స్నేహంబుఁజేసెను । శీఘ్రముగను
"రమ్ము విహారము । రయమున" నన నేను
విషయమెఱుంగమి । వెళ్ళితుదకు

నీగ్రోయువతుల కడఁజేరి । నిర్మలంపు
బుద్ధిమై మరలితినన్న । పుణ్యపురుష !
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 39.

సీ॥ ధరియించి బంగాళ। తలపాగనేటాలు
చేరంగ, "నబ్బుల్ల। శేటు" గారు
కొనిపోయిగృహమునఁ। గూర్మితోనొకనూము
ప్రత్యేకముగఁదన। పంచనిచ్చె
ఆతనియధికంపు। టనుభవజ్ఞానంబు
అక్షరజ్ఞానంబు। నరయనున్న
వస్త్రకంబునఁజాల। వాసిగాంచుచునుండి
భారతీయులచేత। గౌరవంబుఁ

జాలనొందుచు నుండిరి। సరసులార :
అనిన మీరిప్డు వందన। మందుకొనరె
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 40.

సీ॥ దర్బానుకోర్టుకుఁ। దలపాగతో వెళ్ళ
మేస్ట్రీటు నావంక। మిట్టిజూచి
తీయుమాయనదాని। దీయకబయట రా
హిందువుల్ తలపాగ। నిడుటమాన్ప
శాసనంబునుదెల్ప। శాంతంబుగావిని
నాచర్యపత్రాన। నాఁడువ్రాయఁ
పేరువచ్చెనునాకుఁ। బిలువని పేరంట
కాడంచు ప్రెస్సులో। కాలమహిమ

అరయ దక్షిణ-ఆఫ్రికా। యంతనాకు
కలిగె ప్రఖ్యాతి యననీవు। తెలిసెమాకు
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 41.

సీ॥ ఉద్యోగి రైలులో। "ఊ" లెమ్మి, రావయ్య
వెనుక పెట్టెకు వెళ్ళు। మనుచుఁగనలి
పోవని-చోనినుఁ। బోలీసుఁ బిలిపించి
నెట్టింతునావల। నిజముచూడు
మనగనే వినకుండ। నంతటపోలీసు
బలముతోఁజేబట్టి। బయటఁద్రోయ
మ్యానేజరుకు నేను। మఱునాఁడుతంతిచ్చి
వలయు సౌకర్యము। వడసిమరల

చార్లెసుటవును జేరితి। జాలకష్ట
మనగవర్ణపు ద్వేషమం। చరసినాము
ధర్మపరిరక్షు! హైందవ। దాస్యమోక్షు!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 42.

సీ॥ తెల్లవారినిగూడ। నల్లవాడనినన్ను
కూర్చుండనీక బల్। క్రూరముగను
అన్యాయమునుమఱి। యవమానమునునాకు
జేయంగ "లీడరు। సీటు" మీద
కూర్చుండబెట్టితాఁ। గూర్చుండెనప్పుడు
బాటసారులమధ్య। బండిలోన
నేచేయునది లేక। నిశ్శబ్దముగనుండి
పయనమై చేరితి।"పార్డికోపు"

అనుచువ్రాయంగఁ గాదొకో। యరయమాకు
భారతీయుల కష్టముల్। బాగఁదెలిసె
ధర్మపరిరక్షు! హైందవ। దాస్యమోక్షు!
కలిభయత్యాగి జోహారు! గాంధియోగి। 43.

సీ॥ లీడరు చోటులో । లీడరుకూర్చుండ
బుద్ధిపుట్టగవాఁడు । బుద్ధి లేక
తనపాదములక్రిందఁ । జినిఁగిన గోనెను
పఱచి కూర్చుండని । పలుకరించె
అవమానము భరింప । నసమర్థుడగుటఁచే
కూర్చుందు బండిలోఁ । గూర్చొమనిన
అనగానె బూతుల । నరయంగఁదిట్టుచు
గూబలుపగులంగఁ । గొట్టియతఁడు

సేవకునిచోట గూర్చుండి । శీఘ్రముగను
"స్టాండరుటను" జేరెననగ । సంతసంబె?
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు: గాంధియోగి॥ 44.

సీ॥ నల్లవాడౌటచే । న్యాపసల్ హోటలు
నందు నేనుంటకు । నష్టు సెప్ప
నాదరించెను జాల । నంత "గనీశేటు"
జోహాన్సు బర్గులోఁ । జోద్యముగను
పయనమై పోవగ । "ఫస్టుక్లాసు"న నేను
గార్డుమార్గంబునఁ । గాంచినన్ను
మూడవక్లాసుకు । ముందుగా బొమ్మనన్
వలదని యొకదొర । వానినంపె

చీకటిపడ "ప్రిటోరియా" । చేర్చెరైలు
అనుచు వ్రాయగఁ గష్టంబు । లన్ని తెలిసె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు : గాంధియోగి॥ 45.

సీ. జాలిచే షూటులు । "జాక్స్టను" గదినిచ్చి
యత్యంత ప్రేమతో । నాదరించె
"జేకరు" తెలిసిన । పేదరాలింటిలో
బసఁగూర్చు సంతోష । పరితివంత
కించిత్తు పనిమైన । కేసులో నీకష్టు
లేకుంట "జేకరు" । నీకుఁ దెలిపి
పైనందినము తాను । దైవప్రార్థనఁ జేయ
చర్చికి నినుఁగూడి । చనుచునుండ

"ఈశ్వరుఁడు జూపు త్రోవలో । నేగువాఁడ"
ననుచునుంటివి కాదయ్య । ఆర్యపుత్ర !
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 46.

సీ: పరిచయంబైనారు । ప్రార్థనాగృహమందు
"కోట్సు" "హారిస్" "గాబు" । కొంతలేక
తులసిమాలనుజూచి । దుఃఖితుఁడై "కోట్సు"
దండ్రెంపఁగ "తగదండి" యంటి
"పాపకృత్యము సల్ప । పాపంబుఁబోఁగొట్టు
నేనును నమ్మిన । నిర్ధరిత్రి"
అనగా నెతల్లులు । మంటకయుండంగ
వలెనని ప్రార్థించు । వాఁడ కాను

అనుచుఁ జెప్పంగ దెలిసెఁబో । యనఘ! మనదు
పాపపుణ్యంబుమనకని । పరమపూజ్య!
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 47.

సీ॥ వర్తకులోకసభఁ । బరఁగసత్యముగూర్చి
చర్చింపు డనివేఁడ । జంకులేక
ఏదేశమునగాని । యెల్ల ధర్మములలో
సత్యమేమిన్నని । చాటినాఁడ
మతభేదములమీఱు । మఱువుఁడెల్లప్పుడు
బరఁగ సంఘమునకై । పాటుపడుడు
మేలగు నని తెల్పు । నాలించి సభ్యులు
తలలూచి సద్బుద్ధి । మెలఁగిరనుచు

నీవ వాక్రువ్వఁదెలిసెఁ బో।నిర్మలాత్మ !
మంచిమార్గము సూపెట్టు । మాననీయ !
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 48.

సీ॥ భారతీయులఁగాలి । బాటలోఁబోకుండ
రాత్రితొమ్మిది మీఁద । రాకబయట
చేయు శాసనమొండుఁ । జేసియుండగ "క్రౌజు"
వాకింగు "పర్మిటు" । వ్రాసియిచ్చె
"ప్రిటూరియాలోనున్న" । ప్రెశిడెంటు వీధిలో
వాయువు సేవించి । వచ్చుచుండ
పోలీసుతన్నుట । పోవుచుండుచుగాంచి
"కోట్సు" క్షమాపణ । కోరుమనెను

ఆత్మగౌరవ ముండదు । "ఆఫ్రికా"లో
భారతీయుల కని వ్రాయ । బాగుదెలిసె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 49.

సీ॥ తెగునట్లు సిద్ధము । "దావా"ను చేయంగ
గ్రహణశక్తిమిగులఁ । గలిగెనాకు
ఈ కేసు జరుగుచో । నిరుపక్షములవారు
నాశనంబగునట్లు । నాకుఁ దెలిసె
రాజకీస్నేహంబు । రయముగా గావించి
సంధిని కుదిరింప । సత్వరంబె
ఫైసలాయెను కేసు । పాపము "తైయాబ్జి"
చెల్లింపరొక్కము । చేత లేదు

దీక్షవాయిదాలుగ బాకీ । దీర్చునట్లు
సల్పగల్గితినంటివి । సంతసంబ
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 50.

సీ॥ క్రైస్తవ మతములోఁ । గలియనివారికి
ముక్తిలేదనువారు । మూఢులనితి
మనుజునికే తప్ప । మఱిజంతువునకాత్మ
లేదన నమ్మిక । లేదనితిని
మతములలో నెల్ల । మామతమే చాల
శ్రేష్ఠంబనుచు నేను । జెప్పననితి
ఇస్లాము మతములో । నెందఱో మిత్రులు
చేరుడనుచు వేడఁ । జేరననితి

ననుచు వ్రాయంగఁ గాదొక్కో । యరయమాకు
అన్యమతములలోఁ జేర । నాశ లేదు
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 51.

సీ॥ మాతృదేశముఁ జేర । మదిఁగోర్కి జనియింప
"నబ్దుల్ల" యొకవిందు । నరయఁ జేసె
శాసనసభలోని । సభ్యుల నెన్నడి
భారతీయుల హక్కుఁ । బాపుబిల్లు
అరసినేఁ జెప్పంగఁ । నతిథులు నన్నింక
నిల్వఁడనుచుఁ గోర । నిలిచి తేను
"అడ్వొకేటుకు ఫీజు" । అనగానె "అబ్దుల్ల"
ప్రజలసేవకుఁ గోరఁ । బాడిగాదు
అనుచు తెల్పితివని వ్రాయ । నరయఁ దెలిసె
ధనము గడియించు మార్గము । ధర్మచరిత
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 52.

సీ॥ బిల్లును రెన్నాళ్ళు । ప్రెసిడెంటు నిల్పుచు
సంతోషకరమగు । తంతినివ్వ
చేవ్రాలు మిక్కిలి । చేయించి "అర్జీని"
పెట్టిన "ప్యాస"య్యె । బిల్లునాఁడు
కాలనీలకునాఁడు । కార్యదర్శిగనుండ
అర్జీని "రిప్పను" । కంపి తేను
పంపంగ నర్జీలు । పత్రికల్ ముద్రించి
వ్యాసముల్ మాపట్లు । వ్రాయగానె
నేను "నేటాలు" దేశాన । నిలిచినాఁడ
ననెడి నీ త్యాగశీలంబు । నౌనెపొగడ
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 53.

సీ॥ అడ్వొకేటుగఁజేర । నర్జీనిపెట్టంగ
వక్కీళ్ళు సభజేరి । వలదటంచు
సుప్రీము కోర్టును । సులభాన పురికొల్పి
పానకమునప్పుల్లఁ । బాతివార
లఙ్డువచ్చిరిగాని । "యట్టర్ని జనరలు"
మంజూరు జేసెను । మఱుగు లేక
దరఖాస్తు మంజూరు । ధర్మంబుగాఁజేసి
ఆదరించెను "జడ్జి" । యనుచుఁ వ్రాయ
ధరణి నెద్దానఁ బక్షపాతంబు నూప
పాడిగాదను నీసూక్తి । ప్రథితమయ్యె
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 54

సీ॥ నేనొకసభజేయ । "నేటాలు ఇండియన్
కాంగ్రెసు" అనినామ । కరణమయ్యె
పబ్లికువర్కుకుఁ । బరుల సొమ్మును దెచ్చి
పనిజేయకుండుట । భావ్యమగును
పట్టుపట్టినఁగాని । పను లేమి కావంచు
తెలియంగవలెనయ్యె । తెల్లముగను
సంఘపు జీవము । సరియైన లెక్క లే
యనుచు నేటికి మీరలరయరయ్య
అనుచు వ్రాయంగఁ గాదొకో । యరయ మాకు
ధర్మమేదియోఁ తెలిసెను । ధర్మచరిత !
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 55.

సీ॥ చండాల బీదలు । సరిగనీ లేకుండ
కాంగ్రెసులోఁ జేరఁ । గష్టపడిరి
"బాలసుందరము"ను । బాదంగ యజమాని
వడకుచునాముందు । వచ్చినిలచె
నే కేసు జేయించి । నేరము మోపింప
యజమాని మార్చున । కాజ్ఞవచ్చె
కేసును వినినట్టి । గిరిమిటియాలెల్ల
సంతోష పడినారు । సరసులార !
అనఁగ నీదగు సమభావ । మవని వెలసెఁ
బుడమినిఁ బేదలను బ్రోవఁ । బొట్టినావు
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 56.

సీ॥ కూలిచేయుచునుండి । కూరగాయలు పండి
మావితోటలు పెంప । మంచివారు
వర్తకంబున పోటి । వచ్చి వ్యాపారముఁ
జేయంగ రాగానె చెడ్డవారు
దాన నేటాలులోఁ । దలకు పాతిక పౌన్లు
గిరిమిటి మాలపై । నరయ పన్ను
వేయంగ కొందఱు । విడిచిరి ప్రాణముల్
పదివేలుమందిపైఁ । బద్ధులైరి
తుదకు సత్యమే జయమందె । తొలుత వినుఁడు
అనఁగ తెలిసెను మర్మము । లన్ని మాకు
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 57.

సీ॥ ఆత్మసాక్షాత్కార । మగునని బీదల
సేవించు ధర్మము । స్వీకరింప
భారతసేవ,నా । పాలయ్యె సాంబ
నాదుభాగ్యముగాదె । నాఁడునేఁడు
మతములఁ గూర్చినే । మానకచదువంగ
హిందూమతంబుపై । హెచ్చుమమత
మాంసంబు బాలుఁడు । మానంగ ననుఁజూచి
తల్లడిల్లెను వాని । తల్లి, కాన
మరల వారింటి కేగుట । మానుకొంటి
ననుచు వ్రాయంగఁ గల్గిన । యార్యవర్య !
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 58.

సీ॥ మంచివాఁడనియును । మఱియేమిఁ జెప్పిన
నమ్మువాఁడనియును । నాకుపేరు
మితిమీఱినమ్మంగ । మిత్రుఁడునాయింట
వేశ్యతోఁ రమియింప । వీలుగలిగె
"నిల్లువిడిచివెళ్ళు । మిప్పుడే నీవింక"
ననవాఁడు వినమినే । నంతఁగినిసి
"పోలీసు కొప్పింపఁ । బోమన్న" భయపడి
వదలెను శరణంచు । బాలిశుండు
తప్పుదొడరిన రక్షించు । తండ్రికలఁడు
మనసుశుద్ధమయిన దన । మాకుఁదెలిసె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 59.

సీ॥ ఆఫ్రికా వసలినే । నరయంగనింపియా
చేరంగ నెక్కితి । స్టీమరొకటి
అసన, తెనుగుఁనారి । సత్యాంతమగుభక్తి
శ్రద్ధయు త్యాగంపు బుద్ధికలదు
ఆఫ్రికా జైలులో । నరవము నేర్చితి
"యరవాడ" జైలులో । నురుదు నేర్చి
ఆంధ్రమ్ముఁజక్కఁగ । నభ్యసించెడి భాగ్య
మిసుమంతయయిన లభింపదయ్యెఁ

గాన హిందీనిమీరుఁ । ఖండితముగ
నేర్వఁగోరెద ననసీవు । నేర్వవలదె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 60.

సీ॥ ఆఫ్రికాస్థితిగతు । లన్నియు చిత్రించి
ప్రచురించి పొత్తముల్ । పంపినాను
ప్లేగును బాపంగఁ । బ్రీతితోఁజూచితి
పాడైన ధనికుల । పాకిదొడ్లు
శుద్ధంపుముంగిళ్ళు । చూడసంతసమయ్యె
మాలవాడను వెళ్ళి । మాకుఁనాడు
దేవాలయమునందు । దేవుఁడుండఁగనొక్క
మూలలో బెంటంత । ముణుఁగుచుండె

పనఁగ బరిశుద్ధి యేలన । దభిమతముల
నిసుమడించు నటంచునే । మెఱిఁగినాము
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 61.

సీ॥ రాజభక్తినినేను । రయము నింగ్లీషు
వారికినిమించితి । వాస్తవముగ
"గాడ్ సేవ్ దికింగ"ని । గానమ్ముసల్పితి
"రాజశత్రులంజంపు । రయము"ననెడు
మాటకునర్థంబు । మనసుననాటంగ
పూర్తివిరోధము । పూర్తముగను
రాజభక్తినిగూర్చి । రాజుల్లె, రోగుల
కుపచరించెడు కోర్కె । యపుడునాకు
అనుచు వ్రాయంగ గాదోకో । యరయనిపుడు
రాజభక్తి శుశ్రూషలు । రహినిగంటె
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 62.

సీ॥ బావగారప్పుడె । పరలోక గతులైన
బొంబాయిసభకునే । బోతినయ్య
రాత్రికి రాత్రియే । రచియింప వ్యాసము
బ్రచురించి సభలోన । పంచబడియె
పడకుచు వడకుచు । వ్యాసముజదువంగ
వలదని చదివిరి । "వాచ"గారు
సిగ్గుసిగ్గనుమాట । చిరునవ్వు, కరతాళ
ధ్వనులెల్ల మోగెను । దండిగాను
ననచు వ్రాయంగనీసేవ । యాత్రికాకు
తెలిసెనిప్పుడుమాకెల్ల । దేశభక్త!
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 63.

సీ॥ సర్ ఫిరోజిషాఁజూచి। సత్వరమ్ముగనీవు
హిమపర్వతంబుగ। నెంచినావు
లోకమాన్యునినీవు। లోతైన వార్ధిగా
నిశ్చయించియుభక్తి। నెఱపినావు
గోఖలేగారేమొ। గోచరించిరినీకు
గంగాప్రవాహము। గానుచూడ
పర్వతంబునునెక్క। పట్టుపట్టఁగలేక
సంద్రమ్ములోదిగ। శక్తిలేక
గంగయొడ్డున నాట్లాడ। గలవటంచు
గోఖలేగారి కడఁజేరఁ। గోరినావు
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 64.

సీ॥ పచ్చప్ప హాలులో। పచ్చపొత్తంబులు
నేడిరోక్లైలవలె। వెళ్ళిపోయె
ఆబాలగోపాల। మాంగ్లేయమండలి
వ్యాసమాద్యంతము। వఱకు వినిరి
భేదింప వచ్చును। ప్రేమచేబంధంబు
లెట్టివైననుకాని। యిష్టమున్న
కావింపసభనేను। కలకత్తఁజేరగ
దర్భానురమ్మని। తంతివచ్చె
భార్య పిల్లలతోఁగూడి। బయలుదేర
ఆఫ్రికాచేరితినసిన। యార్యవర్య!
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 65.

సీ॥ పెద్దదైన తుపాను। పెరుగుచునుండంగ
మతభేదములఁజూడ। మాయమయ్యె
సర్వేశ్వరునిఁజాల। స్మరణఁజేయుచునుండ
యాత్రికులందఱు। నరసి తేనుః
తొలఁగె తుపానన। తొలఁగె నీశ్వరభక్తి
మృత్యుభయముపోవ। మాయచేరె
తొందరలేకుండ। తుదకుఁజేరగనోడ
దర్బాను రేవులోఁ। దగినయట్లు

చూడలంగరువైచెను। నాఁడటంచు
దెలియఁజెప్పంగఁ మాకెల్లఁ। దెలిసెనయ్య
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 66.

సీ॥ మముఁగని దొరలెల్ల। మరలింపవాబసు
"క్వారంటియన్న"ను। ఖాయపఱచి
ఏజంటు అబ్దుల్ల। నెదిరింప నాతఁడు
భయపడకుంటచే। బాసియతని
"మీరు తిరిగివెళ్ళ। మీఖర్చులిత్తుము
వినకున్న వార్ధిలో। వెఱపులేక
ముంచివైచెదమ"ని। మూకలు తెల్లోళ్ళు
చెప్పంగ ధైర్యము। చెదరలేదు

తుదకు యాత్రికులందఱు। తోడమేము
దిగితి మనసంతసంబయ్యె। ధీరవర్య!
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 67.

సీ॥ దారిలో తెల్లోళ్ళు । దండిగ రాళ్ళతోఁ
గొట్టంగ స్మృతితప్పి । కూలినాడ
గిరివైచి మాకప్ప । గింపుడు గాంధీని
యనుచునుండ గృహము । సంతవీడి
పోలీసుస్టేషను । పోయిచేరితినేను
మారువేసము వేసి । మరుగులోన
"ఘాతుకులను మీరు । కనిపెట్టఁగల్గిన
శిక్షింప కేసును । జేతు"మంచుఁ

జెప్పమిత్రులు వలదని । చెప్పినాడ
ననుచు వ్రాయంగ సీమత । మంత తెలిసె
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 68.

సీ॥ పత్రికా ప్రతినిధి । ప్రశ్నలకెల్లను
బదులు సెప్పితినేను । భయము లేక
నిందించి గుంపులన్ । నిర్దోషి వనినన్ను
వ్రాయంగఁబత్రికల్ । వానిఁజదివి
తెల్లవారందఱు । తిన్నగ తలవంప
భారతీయుల పేరు । ప్రబలమయ్యె
మూలధనము జేర్ప । మూఁడునుకీడులు
సార్వజనికసంస్థ । జరుగదపుడు

అనఁగ కష్టీఫలీయని । యందఱకును
తెలియుచున్నది తేటఁగ । ధీరవర్య
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధయోగి॥ 69.

సీ॥ గృహశిక్ష నీయంగ । బహుసుగుణంబులు
బాలురు నేర్వంగ । వీలుపడెను
విద్యాలయము జేరి । వివిధ దోషంబులఁ
జ్యేష్ఠపుత్రుండు నేర్చె । శీఘ్రముగను
పాండిత్యమునకన్న । పరగ మేలైనది
స్వాతంత్ర్య మని చెప్ప । సత్యముగను
కోటివిద్యలు నేర్వ । కూర్మితో నేల, గు
లాములై పడియుంట । తాము బడిని

ననుచు స్వాతంత్ర్య సంగ్రామ । మందునీవు
చెప్పియుండుట తగునంచుఁ । జెప్పవలదె?
ధర్మపరిరక్షు ! హైందవ । దాస్యమోక్షు!
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 70.

సీ॥ కుష్ఠరోగికి నేను । కూర్మితో నన్నంబు
పెట్టి పుండ్లు కడిగి । కట్టుగట్టి
నాశతీఱకయంత । నాస్త్రిలో నర్సు
పనిచేయ మనసెంతో । పడెను శాంతి
కడగొట్టు పుత్రుని । కనినప్డు నాభార్య
పురుడు పోయఁగ రామి । పురుడు పోయ
నాస్త్రీయనుభవ । మరయంగ "త్రిభువన
దాసు" గ్రంథపఠన । తగినశక్తి

నంతనొసగెననంగమా । కెంత తెలిసె
నేనసల్పంగ వలెనయ్యా । సిగ్గువిడచి
ధర్మపరిరక్షు! హైందవ । దాస్యమోక్షు!
కలిభయత్యాగి! జోహారు ! గాంధియోగి॥ 71.

సీ॥ ఇంద్రియ నిగ్రహ । మెంతేనిఁజేయంగ
పడకలు దూరంబు । పరచినాను
భోగసాధనముగ । బూనంగ భార్యను
నేకపత్నీవ్రత । మెట్టులగును
శపథ బంధముచేత । సరసులు వ్యభిచార
మందుండి తొలగంగ । నగునఁవీలు
లోకసేవనుజేయ । లోభుల కబ్బదు
ధనపుత్రికాంక్షలు । దరగకున్న

అనుచు వ్రాయంగ మాకిపుఁ । డరయఁదెలిసె
బ్రహ్మచర్యమనఁగనేమొ । బ్రహ్మచారి
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 72.

సీ॥ బ్రహ్మచర్యంబన । బ్రహ్మదర్శనమని
యనుభవసిద్ధంబె । యనఁగవలయు
ఆత్మశరీరము । నరయంగ బుద్ధిని
రక్షించునీయది । సాక్షినేను
బ్రహ్మచారికి వన । పక్వమైనఫలమా
హారమనుచుఁ జెప్ప । నరయరయ్యొ
బాహ్యోపవాసంబు । పాటింపనబ్బదు
మనమున భోగముల్ । మానవలయు

అనుచువిశదీకరింప మా । కంత తెలిసె
బ్రహ్మచర్యంబనఁగనేమొ । బ్రహ్మచారి
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 73.

సీ॥ శాస్త్రియమ్మెనఁజాల । చాకలి ఖర్చులు
దాననేనుదకంగ । దవిలినాఁడ
నేలుఁవ చలువనేఁ । జేయంగ గోఖలే
మంచి చాకలివి నీ । వంచుననిరి
క్షౌరమ్ము చేయక । క్షౌరికుఁడంపగా
కత్రించుకొంటిని । క్రాపు నేను
కోర్టులో నడిచూడ । కోలాహలంబయ్యె
అయినను నాకది । యధిక ప్రియము
టంచు వ్రాయంగఁ గాదొకో । యరసిమేము
మితము బాటింప వ్యయమందు । మేలుకల్గు
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 74

సీ హక్కులగడియించు । నక్కర యేకాక
రక్షింప వలెనయ్య । రాజ్యమెప్పుడు
బోయరు యుద్ధాన । పోయి సేవను జేయ
తెల్లోళ్ళలో మార్పు । తెలియవచ్చె
మరణింపరాబర్ట్సు । మాడుచు నెండలో
వారిని మోసుక । వచ్చుచుండ
మీరు త్రావుడు మీఁద । మేము; ముందుగ మీరు
మీరని పోల్జర్లు । మిన్నకుండ్రి
ప్రేమగౌరవముల పోటి । పెరిగెననఁగ
తెలిసె సేవాప్రభావంబు । తేటగాను
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 75.

సీ॥ పడినారు కష్టంబు । భారతీయులుచాల
శుచిగనుండుడనఁగఁ । జూడరయ్య
క్షామంబువాటిల్ల । క్షణములో ద్రవ్యంబు
భరతఖండమునకు । బంపినారు
సత్యవృక్షంబును । సర్వదాపోషింప
సేవరూపము దాల్చి । శీఘ్రముఁగను
రత్నముల్ నీచేత । రంజిల్లుచుండును
కాన నేమరకయ్య । కలనునైన

ననుట వ్రాయంగఁ గాదొకో । యరయమాకు
సత్యపరిపాలనము సేయ । శక్తిగలుగు
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 76.

సీ॥ వెండిబంగారంబు । వెలలేని వజ్రాలు
సమకూరు కానుకల్ । సభలయందు
తీసికొనుటకన్న । దీసికొనకయుంట
కష్టంబుగా లేదు । గాంచనాకు
సమ్మతించెనునాడు । సతిహారమయ్యంగ
పెక్కులు నుడువుచుఁ । బ్రియములేక
కాలక్రమంబునఁ । గస్తురిబాయియు
దీనియౌచిత్యమ్ము । దెలిసికొనెను

లోకసేవకుకానుకల్ । లోకవంద్య!
మనవికావని దెలిసె నీ । మాటచేత
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 77.

సీ॥ కలకత్తానగరాన । కాంగ్రెసు జరుగంగ
కనులార తొలిసారి । గాంచినాడ
అంటరాని తనము । నంతేయుఁజూడఁగ
నిట్టూర్పు విడచితి। నిలిచినట్లె
మాఱుఁగుదొడ్డిని జూచ । మాపని కాదంచు
స్వచ్ఛంద సేవకుల్ । వలుక నేనె
తెచ్చిచీపురుకట్ట । తిన్నఁగదానిని
బాగుచేయఁగనాడు । ప్రతిభ చెడెనె?

కాని మార్పులు నేటికిఁ । గంటిననఁగ
పైదుర్ధైర్యంబుఁగంటిమి । నిశ్చలాత్మ
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 78.

సీ॥ ఘోషాలు బాబున । కు గుమాస్తనేఁగాఁగ
సంతోషమందెను । జాలనతఁడు
సంగతి తెలియంగ । సంతాపమందిరి
వలదని నేనంటి । వారితోడ
గుండీలు పెట్టించు । కొనుచుండి యంగీకి
తీఱిక లేదన । దీనికైన
ఈయమాయకతకు । నెంతేని నవ్వితి
శుశ్రూషణప్రీతి । జూపలేదు

అనుచు వ్రాయంగఁ గాదొకో । యరయమాకు
తెలియఁదగినది తెలిసెను । దీనబంధు
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 79.

సీ॥ విషయనిర్ణయసభ । వెళ్ళుచుగోఖలే
సన్నొంట గొనిపోవ । నాఁడుకంటి
తీర్మానములకెల్ల । దీక్ష ప్రసంగముల్
ఆంగ్లేయ భాషలో । నప్పుడు సలుప
ఆఫ్రికాతీర్మాన । మంగీకరింపంగ
కాంగ్రెస్సు మొహరును । గాంచినేను
భరతవర్షమునాఁడు । భావింప మొహరును
దానిపై వేసెను । తగినయట్లు
అతులమోదాబ్ధిమగ్నుఁడ । నైతినయ్య
యనఁగ నెంతేని సంతస । మందినాము
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి!। 80.

సీ॥ బంగారుపిస్తల్తో । ఫళఫళ మెఱిసెడు
కరవాలములు నడి । కట్టులందు
పట్టుపాజామాలు । పట్టుయంగరఖాలు
మెడలలో వజ్రముల్ । మెఱయుచుండ
రాజులకు౯ మఱి మహా । రాజులఁజూచితి
హార్డింజి దర్బారు । నందునేను
దాస్యచిహ్నంబులు । తలపోయ నెట్టివో
తెలిసెనుగాదయా । తేటగాను
అనుచు వ్రాయంగ నెఱిఁగితి । మంత మేము
దుఃఖభాజనమయ్యెది । దురితదూర !
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 81.

సీ॥ గొప్పవారినిఁజూడ । గోఖలేగారింట
పీలయ్యెనొక నెల । విడిసియుండ
పదివేలుసాలుకు । ప్రజలసేవకునిచ్చి
ఐదువందలు వ్యయ । మరయసేయు
ప్రొఫెసరురాయితోఁ । బొనరెనుసఖ్యంబు
గోఖలే పున్నము । గొనుబుమీఱ
కొండంత నాయకుల్ । గోరంతలైనారు
వీరివిమర్శనల్ । వినగనాకు
వనుచు వ్రాయంగఁ దెలిసె మా। కెల్లనేడు
"రాయి"ను మృదు స్వభావంబు । రాయికాదు
ధర్మపరిరక్ష ! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 82.

సీ॥ వాడుకగానీవు । వాకింగుపోవయ్య
ఎట్టివాఁడవునైన । నెప్పుడైన
కోచిలో సౌఖ్యమ్ము । కొఱకుబోవుదురంచు
అరయంగనాయకు । లనకుమయ్య
పాపనివారణో । పాయంబు క్రైస్తవ
ధర్మాన లేదన । ధర్మమయ్య
గొఱియలఁ బలినిచ్చు । ఘోరయాచారము
కాళికాలయమందు । గంటినయ్య
అనుచువ్రాయంగఁ గాదొకో । యరయమాకు
మంచిచెడ్డలు తెలిసెను । మాన్యచరిత !
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 83.

సీ॥ ధార్మిక సంస్థల । దర్శించుచుంటిని
కలకత్తలోనున్న । కాలమందు
బోయరు యుద్ధాన । పోయిమాచేశిన
పనిగూర్చి యొకమారు । పన్యసించి
రాయిమెప్పువడయ । రయమునగోఖలే
సంతసించుట చాల । సంతసంబు
మూడవక్లాసులో । ముదముతో బోవంగ
సాగనంపిరినన్ను । సరసులెల్ల

రనెడి నీవ్రాత జూడ మా । కంత దెలిసె
పుట్టినందుకు సార్థకం । బిట్టిసేవ
ధర్మపరిరక్ష! హైందవ। దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 84.

సీ॥ మూడవక్లాసులో । ముదముతోఁ బయనమై
కష్టాలనన్నియు । గాంచివాడ
వెళ్ళియుండగ కాశి । విశ్వనాథునిఁజూడ
భక్తినిపురికొల్పు । బాబులేదు
ఆలయ గుమ్మాన । నంతట కుళ్ళిన
పూలదుర్గంధమె । పూర్ణముగను
ఈశ్వరాన్వేషణ । మెంతేని సల్పితి
కానరాడయ్యెను । గాంచనచట

తిట్టిదమ్మిడి పూజారి । తీసికొనియె
ననగఁ దెలిసెను మాకిపు । డంతఁ దండ్రి
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 85.

సీ॥ అప్పీలు కేసులో । నసలుదావాలోను
గెల్పునేఁబొందంగ । గీర్తివచ్చె
"కేవలరాం"గారు । "కేవలంబిచ్చట
నీవుండకుంగదయ్య । నిజముగాను"
అనుచుబొంబాయికి । నంపటననుబంపి
ప్రెస్టుబారిస్టర్లు । బిలువఁదగిన
కేసులున్నవుచెల్ల । వారి నిప్పిలుపింతు
ననిచెప్ప "చేంబర్సు" । నంతనేను
ఆఫ్రికకుఁగొంటిఁ బొంబాయి । యందుననఁగ
మాకుసంతసంబాయెను । మాన్యచరిత !
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 86.

సీ॥ విషసీత జ్వరమెంతొ । విడువక "మణిలాలు
గాంధి"ని బీడింపఁ । గలఁతలేక
కోడిగుడ్లుదినము । కోళ్ళరసంబును
వైద్యుఁడీమ్మనిచెప్ప । వాస్తవముగ
కోళ్ళను జంపించి । కుమారుని ప్రాణంబు
కాపాడ నిష్టంబుఁ గాదటంచు
జలచికిత్సనుచేయ । జ్వరము మొండిదైన
తెల్లవారికిఁ జూడఁ । దేలిపోయె
ఈశ్వరు కటాక్షమున్న వో । నేమిగల్గు ?
ననఁగ ధర్మసంకటమిప్పు । డరసినాము
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 87.

సీ॥ దక్షిణ-ఆఫ్రికా । దయతో కనులబంపఁ
రాబడిచాల ప్రా । ంభమయ్యె
మలయమారుతముచే । మఱచి నిద్రించితి
హైకోర్టుకేసుల । నన్ని వినక
తానొండుదలచిన । దైవమొండుదలంచు
ననునట్లు । తంతిరానంత నేను
ఆఫీసుచాలించి । యాఫ్రికాకరిగితి
నాలస్యమిసుమంత । యైన లేక
అనుచు వ్రాయంగఁ దెలిసె మా । కపుడు నిరుప
మానసేవాధురీణత । మాననీయ
ధర్మపరిరక్షు ! హైందవ । దాస్యమోక్షు !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి । ౮౮.

సీ॥ కాశికిబోయిన । గందు రేపుణ్యము
గోవులబలిమిమై । గొట్టునెడల
దానంబుఁజేసిన । దరుగునే పాపంబు
దేశసేవకులను । దిట్టునెడల
లక్షపూజలు సేయ । లభియించునే ముక్తి
బీదవారిని గష్ట । పెట్టునెడల
జపతపాదులు సేయ । సంఘటించునె దివి
మాతృదేశపుసేవ । మానునెడల
ఎఱిఁగి యెఱుఁగకఁ జేసిన । యెల్ల నేరము
లొక్కపరినీదు పేరెన్న । చక్కబడవె !
ధర్మపరిరక్షు । హైందవ । దాస్యమోక్షు !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ ౮౯

సీ॥ మాటాడలేమంచు । మాటిమాటికిని
మాతృదేశపుసేవ । మానువారు
ధనవంతులముగాము । ఘనదరిద్రులమంచు
మాతృదేశపుసేవ । మానువారు
అరయజైలునకుఁబో । నవని పెండ్లిండ్లంచు
మాతృదేశపుసేవ । మానువారు
కాంగ్రెస్సులోఁజేర । కష్టమెక్కుడటంచు
మాతృదేశపుసేవ । మానువారు
నాదుపుత్రులు కాదంచుఁ । గాదె దేశ
మాతపలుకుచునున్నది । మానకిపుడు
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 90.

సీ॥ గుండ్లదెబ్బలుతిని । కూలిరి పలువురు
దేశసేవనుజాఁటి । ధీరముగను
లాఠీదెబ్బలుతిని । లయమందియున్నారు
దేశసేవనుజాఁటి । ధీరముగను
ఉరితలఁగొట్టుచు । నీశ్వరుఁజేరిరి
దేశసేవనుజాఁటి । ధీరముగను
లాఠీలక్రిందను । లయమందియున్నారు
దేశసేవనుజాఁటి । ధీరముగను
కనుక దేశమాతకుఁ జెప్పి । ఖండితముగ
వీరస్వర్గమునిప్పించు । వీరికెల్ల
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 91.

సీ॥ ప్రొద్దున కన్నంబు । పొట్టనిండఁగ లేక
కాంగ్రెసువాదులు । కష్టపడుచుఁ
గంటినిండుగనిద్ర । కలనైనఁగానక
కాంగ్రెసువాదులు । కష్టపడుచుఁ
దాగెడునీరంబు । దండిగ లేకుండ
కాంగ్రెసువాదులు । కష్టపడుచు
నారోగ్యమంతయు । నడుగంటమిక్కిలి
కాంగ్రెసువాదులు । కష్టపడుచు

నూరకున్నారు జైలులో । నోర్పుమీర
ధీరులకుఁ గష్టమెప్పుడైన । దీరకున్న
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 92.

సీ॥ ఆత్మార్పణముఁ జేసె । నాఢ్యుడౌ సేఠ్ గుప్త
పరమ పూజ్యుఁడు దేశ । భక్తిచేత
సిరినెల్ల వెచ్చించె । చిత్తరంజనదాసు
పరమ పూజ్యుఁడు దేశ । భక్తిచేత
పీడను పదవిని । విఠలభాయిపటేలు
పరమ పూజ్యుఁడు దేశ । భక్తిచేత
అఖిలముం ద్యజియించెఁ । ద్యాగిమోతీలాలు
పరమ పూజ్యుఁడు దేశ । భక్తిచేత

భౌతికశరీరములువీడి । భువినివీరు
కీర్తిదేహులై యున్నారు । ముక్తిఁజెంది
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 63.

సీ॥ విశ్వదాతనుగని । విఱ్ఱవీగుచునున్న
మాతృభూమికినేఁడు । మంచిపేరు
ఆంధ్రకేసరిఁగని । యట్టహాసముసల్పు
మాతృభూమికినేఁడు । మంచిపేరు
భువిమహర్షినిఁగని । పోరాటముల్ సల్పు
మాతృభూమికినేఁడు । మంచిపేరు
దేశభక్తునిఁగని । ధీరత్వముంజూపు
మాతృభూమికినేఁడు । మంచిపేరు

సుగుణుఁడిప్పుడు కల్లూరు । సుబ్బరావు
నిల్పుచూనగఁ జోద్యంబె । నిర్మలాత్మ !
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష ।
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 94.

సీ॥ నమ్మించి ద్రోహముల్ । నరులెంతయునుజేయ
మాలవాఁడగునయ్య । మాన్యచరిత !
పరకాంతలనుగోరు । పరమపాపిష్ఠుండు
మాలవాఁడగునయ్య । మాన్యచరిత ।
హరిజనసేవకు । నడ్డువచ్చెడిద్రోహి
మాలవాఁడగునయ్య । మాన్యచరిత !
దేశసేవనుఁజేయఁ । దిట్టెడి యధముండు
మాలవాఁడగునయ్యఁ । మాన్యచరిత !

కాననిట్టివారిని వేరు । కంగఁజూడ
మాలవాడల నెంతేని । మాయకాదె
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 95.

సీ॥ తల్లి దండ్రులగాంచఁ । దలచునేస్తురటంచు
మాతృదేశము సేవ । మానువారు
తనదారసుతులును । తలచునేస్తురటంచు
మాతృదేశము సేవ । మానువారు
తమబంధుమిత్రులు । తలచునేస్తురటంచు
మాతృదేశము సేవ । మానువారు
తమ యన్నదమ్ములు । తలచునేస్తురటంచు
మాతృదేశము సేవ । మానువారు

పైకిమా దేశమిదియని । పలికినంత
మాత్రనేగౌరవంబున్న । మహినితలప
ధర్మపరిరక్ష ! హైందవ। దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి ॥ 96.

సీ॥ తినుటకన్నము లేక । తిప్పలు పడు టేల
కొబ్బరకాయలఁ । గుడియరాదె ?
త్రాగ కాఫీలేక । తంటాలు పడు టేల
ఎళ్నీరు త్రాగుట । నెరుగరాదె ?
గృహములఁగట్టింపఁ । గలిమి లేదను టేల
గుడిసెలనిర్మింపఁ । గోరరాదె ?
ధరియింప ట్వీడ్లకు । ధనములేదను టేల
త్రిప్పుట రాటముఁ । దెలియరాదె ?

యనుట చెప్పుట జెప్పిన । ట్లాచరించి
నిర్విచారజీవనమును । నెఱపినావు
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి ॥ 97.

సీ॥ లక్షోపలక్షులు । లవణమన్నము లేక
లయమందుటనుజూడ । లజ్జగల్గె
కట్టగుడ్డలు లేక । గష్టాలు పడుచుండ
దోవతులొసగంగ । దోవ లేదె
నిలువను నీడలు । నిరతము లేకుండ
గాలంబుఁగడపుట । గాంచవలసె
ఇన్నియు లేకుండ । నిలవీరు జీవింప
కనులార మేమెట్లు । కానగలము
చిత్తమందింత దయయున్న । శీఘ్రముగను
నరసి మమ్మేలు మాట న్యా । యమ్ముగాదె?
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 98.

సీ॥ లక్షాధికారివై । లవణమన్నముఁగూడ
బీదలకొకయింత । బెట్టకున్న
బాహుబలముగల్గి । భయపడుచున్నట్టి
బలహీనులకు సాయ । పడకయున్న
అధికారమునుగల్గి । యలఁతుల హింసింపఁ
దొడరినవారిని । దిద్దకున్న
పాండిత్యమునుగల్గి । పాపకృత్యంబులఁ
జేయుట కెంతేని । జంకకున్న
మానవాధములనిఁ జెప్ప । మాలవారు
మాలవాడలో నుందు రే । మాన్యచరిత!
ధర్మపరిరక్ష! హైందవ । దాస్యమోక్ష!
కలిభయత్యాగి! జోహారు! గాంధియోగి॥ 99.

సీ॥ ఒరుల సౌఖ్యముఁగాంచి । యోర్వ లేకున్నట్టి
మానవుండెటులయ్య । మాలకాఁడు ?
ఒరులకీర్తినిగాంచి । యోర్వ లేకున్నట్టి
మానవుండెటులయ్య । మాలకాఁడు ?
ఒరుల పదవిఁగాంచి । యోర్వ లేకున్నట్టి
మానవుండెటులయ్య । మాలకాడు ?
ఒరుల బలముగాంచి । యోర్వ లేకున్నట్టి
మానవుండెటులయ్య । మాలకాడు ?
అనెడు సత్యము వలుకంగ । నరయనేల
మాలపల్లియఁజేరి చం । డాలుకొఱకు
ధర్మపరిరక్ష ! హైందవ । దాస్యమోక్ష !
కలిభయత్యాగి ! జోహారు ! గాంధియోగి । 100.

ఓం

శాంతిః శాంతిః శాంతిః

———:o:———